# నేనెరిగిన
# శ్రీ సంజీవయ్యాగారు

—శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఇది నిజమా! శ్రీ దామోదరం సంజీవయ్యగారి వయస్సులో ఏబది సంవత్సరాలు గడిచిపోయినవా! ఈ వార్త నాకు ఆశ్చర్యము కలిగించినది. శ్రీ సంజీవయ్యగారిని చూచిన ప్రతి పర్యాయము, మందహాస విలసితమైన ఆయన మోము తిలకించిన ప్రతి పర్యాయము, ఆయన ఇంకను నిండు యవ్వనములోనే ఉన్నట్లు నేను అనుకుంటాను. నాకు సంజీవయ్యగారితో సుమారు పదిహేను సంవత్సరాల పరిచయము. అనగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాతనే నాకు వారితో పరిచయమున్న మాట. ఒక్కమారు వెనుతిరిగి ఈ పదిహేనుసంవత్సరాలలో జరిగిన సంఘటనలను గుర్తుకు తెచ్చుకొన్నప్పుడు సంజీవయ్యగారిని గురించిన అనేకమైన మధురమైన అనుభూతులు నా స్మృతిపథంలో గోచరిస్తున్నవి. ఆయనకు అప్పుడే ఏబది సంవత్సరాలు నిండినవా అన్న ఆశ్చర్యముతో పాటు మా పరిచయములో పదిహేను సంవత్సరములు గడచినవా అన్న అబ్బురపాటు కూడ నాకు కలుగుతున్నది. పదిహేను సంవత్సరాల క్రింద కలిగిన మొదటి పరిచయము 'ఆది కొంచెము తరువాత అధికము' అన్న సూక్తిప్రకారము క్రమక్రమంగా అభివృద్ధి చెంది ఆత్మీయతగా పరిణమించినది. అయితే ఇందుకు ముఖ్యకారణము సంజీవయ్యగారి సౌజన్యమే అని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఆయన స్నేహశీలి, ప్రేమార్ద్ర హృదయుడు.

1956-వ సంవత్సరములో ఆయన స్థానిక స్వపరిపాలనశాఖకు మంత్రివర్యులుగా నుండిరి. అప్పుడే మా ప్రథమ పరిచయము. అంతకుముందు ఆయనకు తెలుగు సాహిత్యములో గాఢమైనప్రవేశము, రక్తి ఉన్నట్లు నాకు తెలియదు. ఆ ప్రథమ పరిచయములో ఆయన సుకుమార హృదయుడని, కళోపాసకుడని వెంటనే గుర్తించగలిగినాను.

ఆంధ్ర సారస్వత పరిషత్తు భూమికి సంబంధించిన వ్యవహారములలో నేను మొట్టమొదటి సారి ఆయనను కలుసుకొని సంభాషించుట జరిగినది. ఆ రోజు నేను చెప్పినపని ఇరువది నాలుగు గంటలలోపలే జరిగినందువలన సంజీవయ్యగారికి సాహిత్యసంస్థలపట్లఉన్న గాఢమైన అభిమానము నాకు వెల్లడియైనది. 1960 సంవత్సరములో ముఖ్యమంత్రిగా ఎన్నికయి రెండు సంవత్సరాలు ఆయన ఆ బాధ్యత నిర్వహించినారు. సాహిత్య అకాడమీ, సారస్వత పరిషత్తులవంటి సాహిత్యసంస్థలతో నాకు సంబంధముండుట వలన వారిని అప్పుడప్పుడు కలుసుకోవలసిన అవసరము కలుగుతుండేది. నేను ఎప్పుడు వెళ్ళినప్పటికిని, ఏ సమయములో వెళ్ళినప్పటికిని వెంటనే కలుసుకొని చెప్పిన సంగతి శ్రద్ధగా విని ఆ పనిని తత్క్షణమే చేయించుతుండేవారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలకు తగినంత ధనసహాయము ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు ప్రభుత్వము నుండి లభించినదని ఈ సందర్భములో చెప్పవలసియున్నది. సాంస్కృతిక సంస్థలకు సంబంధించిన ఏ పనికైనను సంజీవయ్యగారి తోడ్పాటు అనివార్యముగా లభించెడిది. ఆయన వాగ్దానము చేయకముందే ఆయన సహకారము లభించగలదను విశ్వాసము నాకు వుండెడిది.

సంజీవయ్యగారు ముఖ్య మంత్రిగా ఉన్నకాలంలోనే టాగూర్ శతవార్షికోత్సవాలు జరిగినవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఏర్పాటు చేసిన టాగూర్ శత వార్షిక సంఘానికి ఆయన అధ్యక్షుడు, నేను కార్యదర్శిగా పని చేసినందువలన సంజీవయ్యగారితో చాల సన్నిహితంగా మెలిగే అవకాశము నాకు లభించినది. రాజకీయ రంగములో అనేక గురుతర బాధ్యతలను నిర్వహిస్తూ క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనవలసినప్పటికిని సంజీవయ్యగారు సాంస్కృతిక వ్యవహారాలకు తగినంత సమయమిచ్చి అవసరమైన సహాయము చేస్తుండేవారు. ఆయన చికాకు పడినట్లుకాని, కోపోద్రిక్తుడుగా నున్నట్లుకాని నేనెప్పుడు చూడలేదు. ఆయన వృత్తి ఏమైనప్పటికిని ప్రవృత్తి సుకుమారమైనది; చిత్తవృత్తి కోమలమైనది.

టాగూర్ శతవార్షికోత్సవాలు ఆంధ్రప్రదేశ్‌లో సముచితముగా నిర్వహింపబడినవి. ఇందుకు ప్రధాన కారణము సంజీవయ్యగారు లభింపచేసిన సహకారమే. ఆ రోజులలో ఆయన అఖిల భారత తెలుగు రచయితల సంఘానికి అధ్యక్షుడుగా ఉండేవారు. కార్యదర్శి మిత్రులు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు; ముఖ్యకార్యకర్తలు శ్రీ బోయి భీమన్నగారు. వీరందరితో కలిసిమెలిసి పనిచేసే అవకాశము నాకు కలిగినది. ఈ మహాసభలు హైదరాబాద్‌లో రెండుపర్యాయాలు మిక్కిలి జయప్రదంగా జరిగినవి. ఇందుకు దోహదమైన ముఖ్య

కారణాలలో సంజీవయ్యగారి నేతృత్వము ప్రధానమైనదని చెప్పకతప్పదు. అభిప్రాయ భేదాలను ద్వేషంగా పరిగణించడం సంజీవయ్యగారి స్వభావం కాదు. అందుచేతనే ఈనాడు రాజకీయ రంగంలో ఏ అభిప్రాయ భేదాలు ఉన్నప్పటికిని అన్నివర్గాలవారికి, అన్ని ప్రాంతాలవారికి ఆయనపట్ల ఆదరాభిమానాలు ఉండడం నాకు తెలిసిన సత్యం. తరువాత సంజీవయ్యగారు అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులుగాను, కేంద్ర మంత్రివర్గ సభ్యులుగాను పనిచేసినారు.

శ్రీ సంజీవయ్యగారు ఉత్తమశ్రేణికి చెందిన వక్త. అనర్గళంగా ఆయన ఆంగ్లములోను, తెలుగులోను గంభీరమైన ఉపన్యాసాలు చేయగలరు. తెలుగు ఎంత చక్కగా మాట్లాడ గలరో, ఆంగ్లములోకూడ అంత బాగుగా మాట్లాడగల శక్తి ఆయనకున్నది. ఆయన తెలుగు ఉపన్యాసాలు సాహిత్యపు విందులు. సుప్రసిద్ధులైన రచయితల గ్రంథాలనుండి ఎన్నోపద్యాలు, సూక్తులు ఆయన ఉపన్యాసాలలో తేనెసోనలవలె దొరలిపోవుచుండును. ఈ ఉపన్యాసాలలో కవిత్వము చెప్పడము శ్రీ సంజీవయ్యగారికి వెన్నతో బెట్టిన విద్య.

శ్రీ సంజీవయ్యగారి దగ్గరకు ఎప్పుడు వెళ్ళినా, అదేమందహాసము కందళించు వదనము. అదే చిరునవ్వు చిందులాడు పెదవులు, అదే ఆప్యాయత, ప్రేమతో కూడిన పలుకరింపు, అదే విశ్వాస పూరితమై హృదయ పూర్వకమైన సంభాషణ. అన్నిటికన్న మిన్నగా ఆయన సజ్జనుడు.

అల్పుడెపుడు బల్కు ఆడంబరముగాను,
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా,
విశ్వదాభిరామ వినురవేమ.

సంజీవయ్యగారి ఏబదవ జన్మదినోత్సవ సందర్భమున నేను ఆయనకు హృదయపూర్వకమైన శుభాకాంక్షలు అందజేస్తున్నాను. గడచిన అర్ధశతాబ్దములో అధిక భాగము శ్రీ సంజీవయ్యగారి జీవితంలో సర్వవిధాల ప్రధానమైనది. సంజీవయ్యగారి జీవితంలో మరొక ఏబదిసంవత్సరాలు ఇంతకన్న అభివృద్ధికరంగా పండగలవని నా అభిలాష. భగవంతుడు ఈ అభిలాషను తప్పక నెరవేర్చగలడని నా విశ్వాసము. భవిష్యత్తులో సంజీవయ్యగారు ఇప్పటికన్న ఉన్నత పదవులను అలంకరించి దేశశ్రేయస్సుకు, జాతి అభ్యుదయానికి అనుగుణముగా తమ బాధ్యతలను నెరవేర్చగలరని నా దృఢ విశ్వాసము.

భగవంతుడు వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించవలెనని నా కోరిక.



# అమృతాభిషేకం

—శ్రీ బోయి భీమన్న

**పరిచయము:**

1967 జనవరి 2న, ఉదయం పత్రికలో ఒక వార్త చూచి నిశ్చేష్టుణ్నియాను. భారత ప్రభుత్వ పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ దామోదరం సంజీవయ్యగారు ప్రమాదంలో చిక్కుకున్నారన్న వార్త అది.

ఆ ముందురోజు సాయంత్రం ఏడెనిమిది గంటలప్పుడు. బెజవాడ రోడ్డులో హైదరాబాదుకు 31 మైళ్ల దూరంలోని చౌటుప్పల గ్రామందగ్గర, ఆయన ప్రయాణం చేస్తున్న కారు బోల్తా పడింది. ఎవరో ఒక వ్యక్తి, బాగా త్రాగి సైకిలుమీద వస్తూ తూలి, కారు రైటుసైడు ముడ్గార్డ్కు కొట్టుకొని పడ్డాడు. అతణ్ని తప్పించాలన్న ప్రయత్నంలో కారుడ్రైవరు కారును మలపబోయి, బోల్తా కొట్టించాడు. అది మూడుముట్లుగొర్లి, సంజీవయ్య రొమ్ముపై పడింది.

దేశంలో నాలుగవ సార్వత్రిక ఎన్నికలు ఫిబ్రవరి 15నుంచి ప్రారంభం కానున్నై. రకరకాల పార్టీలు, వర్గాలు, కులమత కథులు, వ్యక్తిగత ద్వేషాలు, అసంతృప్తిపరుల తిరుగుబాట్లు, కహానా మిత్రుల వెన్నుపోట్లు, కుటుంబరుల పెత్తనాలు, పెత్తందారుల హింసాదౌర్జన్యాలు, స్వప్రయోజకుల కుట్రలు అవకాశవాదుల జిత్తులు

రౌడీల వాగ్దానాలు, రాజకీయ హత్యలు, పేదటర్లపై నిఘాలు, పార్టీ కార్యకర్తలపై అఘాయిత్యాలు - వాతావరణం విషకలుషితంగా ఉంది. సంజీవయ్యవంటి ఉత్తమ పురుషుడు, ప్రజానాయకుడు, వక్త రాష్ట్రం అంతటా పర్యటించవలసిన అవసరం ఎంతోఉంది. అట్టి క్లిష్ట స్థితిలో, కృష్ణా తీరంలోని ఒక మిత్రుడి నియోజక వర్గంలో పర్యటించడానికి బైలుదేరిన సంజీవయ్యకు ప్రమాదం సంభవించింది! బ్రహ్మ ఎంత దుష్టుడు!

కారుక్రింద పడిఉన్నాడు సంజీవయ్య. ఆయనతోపాటు ప్రయాణంచేస్తున్న బ్రహ్మానందం అనే స్నేహితుడు, అంగరక్షకుడు కూడ గాయపడ్డారు. కాని వారి గాయాలు స్వల్పమైనవి. బ్రహ్మానందం వెంటనే తేరుకుని తన భుజాలు మోపి కారును ఎత్తాడు. ఆయన గాలి పీల్చాడు.

కారు ఒత్తిడివల్ల శరీరం నలిగిపోయింది. రక్తం కళ్లలో పేరుకొంది. తలలో నరాలు తెగిపోయి ఒకకన్నుకు బాగా దెబ్బ తగిలింది. ఎడమ ప్రక్కఎముకలు రెండు విరిగినై. చచ్చిబ్రతికిన ఘోరప్రమాదం అది.

తర్వాత ఆయన కోలుకోడానికి చాలరోజులే పట్టింది. సికింద్రాబాదు ఆస్పత్రి నుంచి కర్నూలు ఆస్పత్రికి మారి, అక్కడ నుంచే ఆయన ఎన్నికల కార్యక్రమాన్ని నడిపించాడు. తాను బాధపడుతూనే ప్రజల బాధల్ని తీర్చడానికి పూనుకున్నాడు.

ప్రమాదం జరుగుట 27-వ తేదీ సాయంత్రం. ఆయన కారులో వెళుతున్నారు. అప్పుడే చంద్రుడుదయించి పైకి వస్తున్నాడు. ఆ ముందురోజే పుష్యపూర్ణిమ. ఆ రోజు బహుళపాడ్యమి. అశ్లేషా నక్షత్రం. సప్తర్షులు ఉదయిస్తున్నారు. ఈ అద్భుత సౌందర్యాని ముగ్ధుడై ఆయన దాన్ని బ్రహ్మానందానికి వర్ణించి చెపుతున్నాడు. అట్టి స్థితిలో హఠాత్తుగా జరిగిందా ప్రమాదం.

మన స్థితికీ, భౌతిక పరిస్థితికీ ఎంత భేదం!

సంజీవయ్య ఒక మారుమూల పల్లెలో, పేద హరిజన కులంలో పుట్టాడు. న్యాయ శాస్త్రంలో పట్టభద్రుడైనాడు. కాంగ్రెసు పార్టీ తరపున మద్రాసు, ఆంధ్ర, ఆంధ్ర పదేశ్ రాష్ట్రాల మంత్రి అయినాడు. ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రి అయినాడు. అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. నెహ్రూ, శాస్త్రి, ఇందిర మంత్రి వర్గాలలో కేంద్రంలో కేబినెట్టు మంత్రి అయినాడు. రాజకీయాలలో, రాజ్య పాలనలో అందెవేసిన చేయి అయినాడు.

ఆయన ముఖ్యమంత్రిగా ఉండగానే, ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షత క్రింద అఖిల

భారత తెలుగు రచయితల మహా సభలు జరిపాం. ఇప్పటికీ ఆ సంస్థకు ఆయనే అధ్యక్షుడు.

శ్రీశైలం వంటి మహా పుణ్య క్షేత్రాల పునర్వ్యవస్థీకరణకు నాంది పలికిం డాయనే.

చక్కని కవిత్వం వ్రాస్తాడు. ఆయన వ్రాసిన పాటలు, పద్యాలు, హరికథలు జనానందకరమైనై. శ్రావ్యంగా ఎన్నో రాగాలు పాడతాడు. చిన్నప్పుడు ఎన్నో నాటకాల్లో నటించాడు, ఎన్నో కావ్యాలను అంకితం తీసుకున్నాడు.

అలాంటి రసహృదయుడికి, ఇలాంటి క్రూరప్రమాదం ఎందుకు సంభవించింది! ప్రమాదవార్త విన్న వెంటనే కలతపడ్డ నా మనస్సునుండి వెలువడ్డ ఉద్విగ్న భావ తరంగాలే ఈ పద్యాలు. ఆయన ఇతోధిక శక్తి సామర్థ్యాలతో పురోగమించడంకోసమే ఈ సాహితీ పూజ. ఈ అమృతాభిషేకం.

1

నిన్నకాబోలు పుష్య పూర్ణిమము, మగని
రాగ చాంద్రీ జగతికెల్ల రాజు జేసి
మణి తురాయిగ తానె తన్మౌళి నిల్పె!
పుష్యమీతార ఎంతటి పూజ్యదార!

2

నెలకొక్కసారె యైనన్
వలచిన పతితోడి సుఖము వరమని ప్రీతిన్
నెలరాజు కంఠసీమను
మొలిచిన దాశ్లేష మల్లెమొగ్గల దండై!

3

అని నీ వంటివో లేదో,
తను తానే మరచి కారు తలక్రిందై నీ
ఘన వక్షమ్మున కూలెను!
వినువీధులు చెదరె! చంద్రబింబము చీల్లెన్!

4

ఆ క్షణమ్ము మనస్సుకు అమృతరసము,
ఆ క్షణమ్ము కాయమునకు హాలాహలము,
ఏ క్షణమ్మైన నంతియే; హృదయ పద్మ
పల్లవము పయి కోటి కుంపట్ల బరువు!

5

తాగి యొకడు తూలి తలక్రిందులగు గాక,
మేను దొరగు గాక మేర మీరి,
తగుల నేలో మేటి త్యాగికి గాయమ్ము!
కలుగనేలో కీడు కరుణ హృదికి!

6

సమయమునందట్లు మిత్రుడు సాయపడగ
ఉరముపై బడ్డ ఆ బండ బరువు సడలె,
అల్లనల్లన ప్రాణములాడ దొడగె,
పిండియయ్యెను దేహము పీల్చె గాలి !

7

జీవన మరణ రణమ్మున
జీవనమే గెల్చి నిన్ను చెందెను ; నీ సం
జీవాఖ్య బలమొ అది ! జన
సేవాంచిత ఫలమొ! నీకు చేయూతయ్యెన్!

8

కొండంత బరువు నెటు నీ
పండంటి యురమ్ము మోసి బైటపడెన్ ? నీ
గుండెగల బ్రాహ్మి నీకున్
అందగ నిచ్చినదిగాక అద్భుతశక్తిన్ !

9

ఆంగ్లేయ దాస్యము డిపిన
కాంగ్రెసు సారథ్యమీవు గైకొనగనె ఈ
ల్గెం గ్లాని, మురిసె మహి, మధు
వుం గ్రోలెను విరిసి మానవోద్యాన లతల్ !

10

వెనుకబడిన ప్రజలు వెలుగును జూచిరి,
హరికి గిరికి స్వజను లలరి రెదల,
ఎల్ల పీడితులును ఎలగాలి పీల్చిరి,
రాజ్యలక్ష్మి నీకు రాణి కాగ !

11

ఓటుండిన సభ్యుడు, వెల
మాటుండిన మంత్రి యేను మనుజుడు ;
నొసటన్
గీటుండక దొరుకునె నీ
బోటి రసజ్ఞుడు, కళాప్రపూర్ణుడు భువిలిన్ ?

12

నీ శుభాధ్యక్షతను కాదె నిలిచి, తెలుగు
రచయితలు చేసి రఖిల భారత సభాళి ?
స్వయముగా నీవు రచయితవగుటె కాదు,
రచన లెన్నింటికో భోజరాజు వీవు !

13

భారత రాజకీయ సుధి
భాతము కాంగ్రెసు ; దాని గద్దె ధా
త్రీ రథ భాస్కరమ్ము ; భవ
దీయ పదాంకమ్మై స్పృహో ముఖ
ద్వారము చేర్చెదే వెనుక
బడ్డ జనావళి నద్ది ? గాంధిజీ
కోరిక తీరగా భవము
గొంటివి పో హరిజన్ కులమ్మునన్!

14

చిన్న పల్లెనుండి చెన్నపట్టణము, క
ర్నూలు, భాగ్యనగరు, క్రొత్తఢిల్లి,
రాజకీయమందు, రాజ్యపాలనమందు
అందెవేసి నట్టి హస్తమెతి !

15

**సర్వలోకాభ్యుదయ తా**త్పర జనహారుండు,
**రాశిపోసిన** పీర భారతము శా(స్త్రి),
**కనకదుర్గాంశ** ఇందిరాగాంధి, వీరి
**మంత్రివర్గాలలో** ముఖ్య మంత్రివైతి !

16

**కాల** రథ ప్రవేగమున
కష్టము కొంత బిగించి, ... దే
**వాలయ** సం సముద్ధరణ
**భా**రము తాల్చిన నిన్ను మెచ్చి, ప్ర
**శైల** విభుండు **చే**సె వ్యధ
**శాం**గిల నీ కమ్రు... ; **మా**
**శ్రీ** లలితేశు గొల్చి, ...
సేవకు సాగు మికన్ ప్రసిద్ధమై !

17

సంజీవికి అయ్యావు, నిను
కంజాసను డేల పెట్ట కార్డెక్సెంట్లో !
**పంజె** అయి కా, దితోధిక
సంజీవిగ ...యు సయ్యా ! సంజీవయ్యా !

18

**మంజు**ల మగు నీ **హృ**దయము
కంజాసను రాణి కిరీటముకాదే? అది నిన్
రంజించదె ? సమ్యగ్గన
సంజీవి ! లేవయ్య ! సంజీవయ్యా ?

19

**పంజాలు** విప్పి, రక్షిడీ
పింజారులు ప్రజలమీద పెత్రేగిరి, త
ద్భంజనము వలయు, నిక దీ
...ం జేకొని సాగవయ్య ! సంజీవయ్యా !



# ప్రేమాంజలి

—శ్రీ దాశరథి

విషమయమ్మైన యీనాటి విశ్వమందు
అమృతమును చిందు హృదయమున్నట్టివాడు,
అతడు సంజీవయ్యాఖ్యుడున్నతుడు, హితుడు
నీతిమంతుడు, భారతమాత సుతుడు

నాల్కపై శారదాదేవి నాట్యమాడు
గుండెలో పాలసముద్రము నిండియుండు
త్యాగశీలి దయాశాలి తరుణహేళి
తెలుగు మనసుల లోపల వెలుగువాడు

తీపిమాటెగాని తిక్తవాక్కే లేదు
శాంతికోరుగాని భ్రాంతిలేదు
మంచిచేయుగాని వంచన యెరుగడు
మనుషులందు మేటిమనిషి యతడు

సంజీవయ్యను గాంచిన,
గింజుకొనెడి మనసుగూడ క్లేశము మరచున్,
రంజిల్లు; నా మనీషికి
అంజలి ఘటియింతునే మహానందమునన్

అతడు వేదికనెక్కినా ఆంధ్ర పద్య
గణము పుంఖానుపుంఖమై గళముదూకు,
అతడు పఠియింపనట్టి కావ్యమ్ములేదు,
సాహితీ బంధువాతడు, సహృదయుండు.

# కార్మిక బంధూ

— "బాలకవి" శ్రీ వడ్డి కృష్ణమూర్తి

శ్రీయుత సంజీవయ్యా !
శ్రేయములన్ గూర్చునట్టి ప్రియతమనేతా !
మాయ తెలుంగని వారు, అ
అమాయకులన్ తీర్చిదిద్దు మంత్రివరేణ్యా !

ముఖ్యమంత్రి పదవి మోదమ్ము పాటించి
అభ్యుదయ పథమ్ము ననుసరించి
యావదాంధ్ర జనులు హర్షంబు జూపంగ
తీర్చి దిద్దినావు తెలుగు భువిని.

కాడి జోడెడ్ల కాంగ్రెసు కార్యములను
నిర్వహించి సమైఖ్యత నెఱపినావు
హరిజనాభ్యుదయముగోరి, అంటరాని
తనము నిర్మూలనా మహో ఘనుడవీవు.

పల్లెసీమలందు పంట రైతులగాంచి
ప్రజలమధ్య నిలచి నిజము తెలిసి
పదవి వున్న, మంత్రి పదవి లేకున్ననూ
జాతి శ్రేయ మరయు నేతవీవు.

జయ జయ ఘన దామోదర !
జయ జయ మాధుర్య తెలుగు సాహితీవక్తా !
జయ జయ కార్మిక బంధూ !
జయ జయ పీడిత జన రథ సారధ్యధునీ !

# మహా సంస్థ

❋

—శ్రీ ఆర్. సుల్తాన్

భారత జాతీయ నాయకులు శ్రీ సంజీవయ్యగారికి సన్మానం జరుపబడుచున్నదని తెలిసికొని నేనెంతయో హర్షించుచున్నాను. నిజానికి యిది వారిసన్మానం కాదు. వారు మనసార ప్రేమించి సేవ చేయుచున్న భారతజాతికిని, అంతకంటె ముఖ్యముగా వారి ప్రత్యక్షసేవలను అందుకొంటున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకును జరుపబడుచున్న సన్మానం. ఎందుకంటే- శ్రీ సంజీవయ్యగారు దాదాపు ఇరువది సంవత్సరాలకాలం భారత రాజకీయ జీవనంతో సమ్మిళితమై, దాని అభివృద్ధికై ఉద్దేశించబడిన ప్రతి ఉద్యమంలోనూ లీనమై కృషిచేసి అశేష ప్రజానీకం యొక్క గౌరవ మర్యాదలకు పాత్రులైనారు.

కేవలం గాలి కబుర్లతోనే కాలం గడుపుతూ రాజకీయనాయకులుగా పేరొందిన వారెందరో వుండవచ్చు. కాని సార్వకాలిక, శాశ్వతిక లక్ష్యమొకటి లేకపోతే అలాంటి నాయకులందరూ ముడిచినపూలవలె త్వరలోనే వాడిపోతారు. శ్రీ సంజీవయ్యగారు అలాంటికోవకు చెందినవారు కారు. జీవితంలో వారికొక మహోన్నతమైన లక్ష్యం ఉంది. అదే ఈనాడు, దేశవ్యాపితముగా చర్చించబడుచున్న సోషలిజం! ఈ లక్ష్యసాధనకోసం వారు జీవితమంతా పరిశ్రమిస్తూనేవున్నారు. దానికోసమై జరుపబడుతున్న ఎడతెగని పోరాటంలో ఎందరి శతృత్వానికో గురియై,

సోషలిజం ముసుగులో అధికారాన్ని హస్తగతం చేసుకొంటున్న బూర్జువాలను, పెత్తందార్లను ఎదిరించి నిలిచినారు. అందుచేతనే వారికంటే సీనియర్ నాయకులమని చెప్పుకొంటున్న ఎందరో అగ్రగణ్యులు, వారికళ్ళెదుటనే వాడి మాడిపోతూన్నప్పటికిని, శ్రీ సంజీవయ్యగారు మాత్రం నాటికిని నేటికిని భారత రాజకీయ రంగంలో ధృవతారగా ప్రకాశిస్తున్నారు.

శ్రీ సంజీవయ్యగారు హృదయాళువు. ఆర్తుల ఆక్రందనాలు వారి హృదయంలో ప్రతిధ్వనిస్తూ వుంటాయి. ఈ సందర్భంలో విశ్వకవి రవీంద్రుడు శరత్ శరన్మేఘములోని మేఘంచేత పలికించిన పసిడి పలుకులు గుర్తుకు వస్తున్నవి. "నేను నీరు కురిసిన మేఘమును. నా నీరు ద్వారా పమును తెలుసుకొన గోరువారు నేను వర్షించిన నీటిచే ఏపుగా ఎదిగిన పంటచేలను సస్యశ్యామలమైన విశాల విశ్వమును చూడుడు" అంటుంది ఆ మేఘం. ఈ మాటలు శ్రీ సంజీవయ్యగారిఎడ సంపూర్ణ సార్థకమౌతాయి.

చరిత్రగతిని చక్కగా గమనించి చూచినట్లయితే ఒక్క విషయం మనకు స్పష్టముగా గోచరిస్తుంది. అదే తరతరాల నుండి కలిమికి లేమికి జరుగుతూ వస్తున్న పోరాటం! ఈ పోరాటం మన దేశంలోనేకాదు, వర్ధమాన దేశాలన్నింటి లోనూ అగుపిస్తూవుంది. అయితే మన దేశంలో జరుగుచున్న పోరాటం ఒక వినూత్నమైన, విశిష్టమైన పద్ధతిలో జరుగుతూవుంది. ఇతర దేశాలలో కార్మికులకు, పెట్టుబడిదార్లకు ప్రత్యక్ష పోరాటం జరుగుతూవుంటే, మనదేశంలో కార్మికుల, కర్షకుల సంక్షేమాన్ని కోరుతున్నటువంటి సోషలిస్టుల ముసుగులోంచి పెట్టుబడిదారులు నిజమైన సోషలిస్టులతో పరోక్ష పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. ఈ పోరాటాన్ని ఎదుర్కొని నిలువడంలో పీడిత ప్రజల ప్రతినిధి శ్రీ సంజీవయ్యగారు విపరీతమైన ఇబ్బందులు గురికావలసివస్తూవుంది. ఉదాహరణకు ఆంధ్ర దేశంలో ఒక వైపున డబ్బులో కూరుకున్న అధికారవర్గం సోషలిస్టుల ముసుగులో పెట్టుబడిదారీ విధానమును పటిష్ఠవంతముగా పదిలపరచేందుకు తీవ్రమైన కృషి చేస్తూవుంటే, యింకొకవైపు శ్రీ సంజీవయ్యగారు కేవలం ధీశక్తితో వారి ఎత్తుగడలను ఎదుర్కొవలసి వస్తూవుంది.

ఈ ప్రయత్నంలోనే శ్రీ సంజీవయ్యగారు వేసిన పథకాలు, చేసిన పనులు సమూలంగా తుడిచిపెట్టబడుతున్నవి.

శ్రీ సంజీవయ్యగారు ఎంతటి సౌమ్యులో అంతటి పట్టుదలగలవారు. దీక్ష, దక్షతలలో వారికివారే సాటి. సంఘదృష్టికి, వ్యక్తిదృష్టికి సంఘర్షణ వచ్చినపుడు లోకి

కులు తమ అభిప్రాయాలకు నీళ్ళు వదలుకొని, తమకు నచ్చనివాటితో రాజీ పడతారు. కాని సంజీవయ్యగారుమాత్రం తాము నమ్మిన సిద్ధాంతంకోసం తమ సర్వస్వాన్ని ధారపోసి పోరాడుతారేగాని తమ అభిప్రాయాలకుమాత్రం నీళ్ళు వదలుకోరు.

శ్రీ సంజీవయ్య తమకు తామే ఒక మహాసంస్థ. అధికారంలో వున్నా, లేక పోయినా వారు ఎక్కడుంటే అక్కడ ప్రజలు తండోపతండాలుగా మూగుతారు.

శ్రీ సంజీవయ్యగారు గొప్ప వక్త. వక్తానికి తడువనివారు, శ్రీ సంజీవయ్య వుపన్యాసానికి లొంగనివారు వుండరట. రాజమండ్రిలో వారు సమసమాజ సామ్యవాదమును గురించి వుపన్యసిస్తూవుంటే భావానుగుణ్యమైన రాగతాళయుక్త సుందరపదగుంఫనము అతిసహజముగానూ, అప్రయత్నముగానూ, అనర్గళంగానూ వెల్లివిరుస్తూ వుండేది. శ్రీ సంజీవయ్యగారి శైలి విశిష్టమైన శిల్పము. అనుకరణకు క్లిష్టతరమైనదైనను వినికిడికి సులభతరమైన ప్రవాహ వేగం కలది. సభికుల గ్రాహ్యశక్తిని, విజ్ఞాన పరిధిని గ్రహించి స్థాయికి తగినట్లుగా వుపన్యసించడం శ్రీ సంజీవయ్యగారికి కరతలామలకం. అంతేకాదు. వారు గొప్ప సాహిత్యపరులు కూడాను. వారి ఆదర పోత్సాహములను పొందని సాహితీ సంస్థలు ఆంధ్రదేశములో అసలు లేవనే చెప్పాలి. అనేకమంది కవులు వీరికి వుద్గ్రంథములను అంకితం చేశారు. ఒక్క సాహిత్యమే కాదు ఏ కళాఖండాన్ని చూచినా వారిహృదయం స్పందిస్తుంది.

శ్రీ సంజీవయ్యగారు నత్శీలి. దాదాపు ఇరువది సంవత్సరాల సుదీర్ఘ కాలంలో వారు ఎంతటి గొప్పపదవులను అలంకరించినా, ఎంతటి గొప్పబాధ్యతలను నిర్వహించినా, అటు శాసన సభలు, లోక్ సభలలో కాని, ఇటు బయటి ప్రజలలోకాని వేలెత్తి చూపెట్టడానికికూడా ఆస్కారమివ్వనంతటి నీతిపరులు.

ఇరువది సంవత్సరాలు అధికారంలో వున్నప్పటికీకూడా ఈనాడు శ్రీ సంజీవయ్యగారికి కనీసం వుండడానికి ఒక యిల్లు కూడా లేదంటే వారెంతటి స్థితిపరిజ్ఞులో తెలుసుకోవచ్చు! ఇటువంటి పుత్రరత్నమును కన్న ఆ మాత ఎంత ధన్యురాలో కదా!

శ్రీ సంజీవయ్యగారు యువకులు. వారి సత్కృషి ఫలితముగా త్వరలోనే నేటి రాజకీయాంధకారం తొలగి వారి నాయకత్వాన దేశానికి వెలుగు ప్రసాదించబడగలదని ఆశిద్దాం! భగవంతుడు వారికి అమరమైన కీర్తినే గాక సంపూర్ణాయురారోగ్యమును ప్రసాదించుగాక!

# ఉత్తమ నాయకులు

*

— శ్రీ ఉంద్రు వెంకటరెడ్డి

శ్రీ సంజీవయ్య రాజకీయ చరిత్ర పరిశీలిస్తే చదువులో పట్టభద్రుడయి, తరువాత న్యాయశాస్త్ర పట్టభద్రుడై, చిన్న ఉద్యోగములో ప్రవేశించగానే వెనువెంటనే శాసనసభ్యులై, పిమ్మట రాష్ట్ర మంత్రిగ, ముఖ్యమంత్రిగ, అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులుగ, కేంద్రమంత్రిగ, వారు కోరకనే పదవులు వరించిన అదృష్టజాతకులు. పదవులు స్వీకరించిన వారిలో చాలమంది పరోక్షకమయిన విమర్శలకు గురికావడము వింటున్నాము. అలాంటి విమర్శలకు గురికాని రాజకీయ కార్యకర్తలలో ఉత్తములలో సంజీవయ్యగారొకరని చెప్పక తప్పదు.

యిందుకే వీరు రాజకీయములో ప్రవేశించగానే ఈ రంగములో క్రింద నుండి మంచి వ్యక్తిగ, వక్తగ రాణించుకుంటూ అఖిలభారత నాయకశ్రేణివరకు అందుకో గలిగారు. హరిజనుడే అయినా హరిజన పక్షపాతిగాదు. అయినప్పటికి పార్లమెంటు జనరల్ సీటుకు పోటీచేసి ఓటమి చెందారంటే ఆ తలపంపు ఆయనది కాదు. భారతజాతిదేనని అనకతప్పదు. అయినా అది ఆయనకు ఒక పాఠమే నేర్పింది.

రాజకీయ రంగంలో నాయకులు రెండు తెగలు—ఏ పదవి లేనప్పుడే ప్రజాసమస్యలలో, ఉద్యమాలలో తలదూర్చి సేవచేసి నాయకులనిపించుకున్న వారు ప్రథమ

శ్రేణికి వస్తారు. మరికొందరు ఏదో సభ్యత్వమో పదవో దక్కాకనే నాయకులనిపించుకుంటారు. వీరు రెండవ శ్రేణికి చెందుతారు. మొదటి శ్రేణికి చెందిన నాయకులలో సంపూర్ణమయిన ప్రజాబలముంటుంది. రెండవ శ్రేణికి చెందినవారికి అవకాశవాదుల మద్దతు మాత్రమే ఉంటుంది. యీ సంజీవయ్యగారు ప్రజారంగములో పనిచేసే అవకాశము లేకపోయింది. అందుచేత వీరు రెండవ శ్రేణికి చెందినవారే అయినా చేజిక్కినఅవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటూ ఆ గౌరవం తరగిపోకుండగ పెంచి పోషించుకొంటూ వస్తున్న ధన్యజాతి అని చెప్పాలి.

వీరు హరిజనులే అయినా హరిజనులకు ప్రత్యేకించి శ్రద్ధ తీసుకుని చేసిన కార్యము ఒక్కటీలేదు. మంత్రులయిన వారంతా వీరి ననుసరిస్తే కులతత్వాలనేవి రాజకీయ రంగములోనైనా యింత వృద్ధ తంగ ఉండేవికావు.

శ్రీ సంజీవయ్యగారు మరో ప్రభైయేండ్లేకాక చిరంజీవులుగ ఉంటూ భారత దేశానికి అధ్యక్షులు కావాలని ఆశిస్తున్నాను.



# Sanjeevaiah - From the birds's eye point of view

SRI D. SIVAJI

It is happy to know, that Masulipatam, one time hub of political activities, is celebrating Mr. Sanjieevaiah's 'Swarnotsavam'. The credit must go alone to Masulipatam for celebrating the Golden Jubilee of a man from a neglected class, a midst of political confusion in the country. As an ordinary citizen like my brethern in other parts of the country, I have no liking for men in power for their immoral activities. However, there are some people who deserves special mentions and Mr. Sanjeevaiah is one among them.

By birth none shall be called high or low but by conduct and character! This maxim is ture in the case of , Mr. Sanjeevaiah. Born in a middle class family in Pedapadu, Kurnool District in the year 1921, he lost his father when he was just 5 years old. The burden of upbringing of this unfortunate boy fell on his ambitious elder brother Mr. D. Chinnaiah, who resolved to educate him by spending his meager earnings and suffered himself in the process.

Mr. Sanjeevaiah received his Elementary Education in his village and High School Education in the Municipal High Schcol, Kurnool. The place being 5 miles from his home he had to perfom to and fro journey daily by foot.

In 1938, he joined in the Ceded District College, Anantapur from where he graduated in 1942. He studied Law at the Madras Law College and from 1946 to 1948 he worked for a while as an apprentice in the Mardas High Court. Later for a brief period he took the teaching profession, and quite a number of students who were taught by him still remember him with gratitude.

Mr. Sanjeevaiah, unlike many present day men in power, started his political life from the student days by participating in the freedom strugle. First he was elected a member of Provisional Parliament of India in January, 1950. During that time he was well known as an young and deligent member from the South and caught the eyes of National leaders. With this humble starting as member of Provisional Parliament began his political life like Tennyson's Brooke. Later he was elected to the Madras Assembly from the Kurnool District and joined the Cabinet of Sri C. Rajagopalachary in the year 1942 as Minister of Co-operation and Housing. Since then he had been a Minister until he was chosen as the President of Indian National Congress in 1962.

Now he had the unique honour of working and associating himself with many eminent Stalwarts like Rajagopalachary, B. Gopala Reddy and late Andhra Kesari. At the National level he associated himself with many great men like Late Mr. Nehruji and Mr. Sastry.

In the year 1960, the men in power in Andhra Pradesh has stated to elevate him to the Chief Ministership. As a Chief Minister, despite many obstacles he proved himself as second to no one. During that short span of two years as Chief Minister he innovated the entire system. One of the main Acts is appointing a Law commission to amend the out-dated Government Acts on land lease and Land reforms. Next to be note worthy is appointing a Joint Staff Council to solve the age old differences between Gazetted &non-Gazetted employees. And there are number of benevolent acts like granting of old age pensions, land to the landless and so on. He placed the Andhra Pradesh on the Industrial Map of India by establishing the biggest Synthetic drug factory at Hydrabad, sugar, cotton and fertilisers Industries at various places. His reign as Chief Minister was peaceful and received Kudos from press and public.

Later in the year 1962 he became the President of Indian National Congress, a position which was held in the past by many illustrious men. On being elected as President of A. I. C. C., in his Presidential address, keeping the evils of his own party in view, he asked the leaders directly as " it is a fundamental change that i ask for-not merely a change in the character - but also a change in the spiritual quality of our men ". Further he stressed for "character with purpose with an ideal which will purify the body politic". In the same address he appealed to the youth of the country, with his usual frankness to hold the destinies, as " the old generation is gradually, every-day bidding us farewel, the present generation is stepped in the present day ills, but the youth of the Country, the generation of tomorrow, awaits its destiny". Thus he inspired the youth and rejuvenated the Congress Organisation and got the verdict of the people in his favour in the General Elections.

On Januray 24, 1964, Mr. Sanjeevsiah joined in the Central Cabinet of Late Mr. Nehru, in charge of Labour and Employment and continued in the cabinet of Late Mr. Sastry. When Mrs. Gandhi formed her first Cabinet in the year 1966, he was entrusted with the Portfolio of Industries. During his

tennure as Central Cabinet Minister he solved many knoty Labour problems and other Industrial disputes. He represented India abroad on many occasions such as International Labour Conferences and other things and returned with flying colours. His sincerity to the ideals, his fearlessness and frankness, the differences with Andhra Bosess costed him his parliament seat in the 1967 Elections. He never despaired with the short comings and began to serva the Country in his own capacity. Consequently in the Historic split of the Cobweb Congress into two groups, as an young and dynamic man with Socialist views, he joined the Congress headed by other dynamic leaders. On February 18, 1970 he was sworn again as a Union Minister for Labour, Employment and rehabilitation. In this capacity he brought out many changes in the Labour acts and solved many disputes like Dockyard and Calcutta Jute workers' Strikes. His political sagacity reflected in the problems and solutions which he handled.

Today, Mr. Sanjeevaiah, like in the past, with his usual vigour, is there like a soldier to serve the nation in any capacity. We know, in the present day political arena only moneyed men and those men who are having affluent circles behind them or yes men of bosess are in power. I often worded how this modest man, from a remote Andhra Village having nothing of the above said qualities, is able to shine in the politics. Moreover, he lacked the main traits i. e., cunning and deception which are essential in the present day India.

The reasons for his successive triumphs are simple. First-of-all he is honest and sincere to his ideals. He is one of the great men in the present day India. He was endowed with many brilliant qualities which evokes admiration. He possessed great physical and moral courage, and in state craft he had few equals. Besides being a distiguished administrator, he was a Scholar of no ordinary merit. He composed many poems in Telugu and occassionally entertained his friends with his pomes. In his private life he was a puritan, pious, simple and austere in habit. He attracted large number of friends and admirers with his smiling face and unassuming approach to them. A strict desciplinarian as a Congress man, loyal to his collegues, sincre to his principles and never compromised with his principles.

Another reason for his success is his virtuous wife Smt. Krishnaveni Sanjeevaiah. She is his best treasure, and best companion in prosperity and adversity, the most careful preserver of his health, and a discreet Manager of all his domestic affairs. She is also, like her husband, fond of poetry, music and drama. Really their combination is an exemplary one.

Such was Mr. Sanjeevaiah, and his wife an ideal characters with the milk of human kindness in them and scarecly abstain from doing a good natured action. India needs such men in the difficult times through which we are passing. Before I conclude I pray the Almighty to give him more health and strength to serve the Nation, and I wish him many happy reterns of the day.

JAI HIND



ప్రముఖ రచయిత శ్రీ రావూరి భరద్వాజ రచించిన 100 వ పుస్తకం " పంచభూత " శ్రీ సంజీవయ్యగారికి అంకితమిచ్చినప్పటి ఫోటో - న్యూఢిల్లీ 1970.



రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్, హైకోర్టు న్యాయమూర్తులతో శ్రీ సంజీవయ్యగారు

*Wish the Swarnotsavam success!*

TEL: NANDI PHONE: 245.

22 CT

# GOLD COVERING ARTICLES.

No.701





GOLD COVERING WORKS
NANDI
TRADE MARK
REGD. 192718.

# NANDi ARTICLES ARE TRUSTWORTHY

No.322.





No.328.







No. 227.

No.169

No.629.









No.284



No.231A.

V.R.Arts

## NANDI

GOLD COVERING WORKS. REGD.

CHILAKALAPUDI. POST. MACHILIPATNAM-2. A.P

*With the Best Compliments from :*







REGISTERED

అజంతా గోల్డు కవరింగ్ వర్క్సు
చిలకలపూడి. P.O. మచిలీపట్నం. 2. A.P.



స్వర్ణోత్సవ సంఘాధ్యక్షులు (శ్రీ) చాపరాల బ్రహ్మానందరావుగారితో
(శ్రీ) సంజీవయ్య గారు